## Second Class.

ద్వి. అడిగినఁ బ్రాణంబులయిన నొప్పింత్రు
నుడివి క్రమ్మఱఁ దప్ప నుడువరు ఘనులు.

అందని ఫలముల కఱ్ఱులు సాచి
వంతనొందుచు ధృతి వదలంగఁ దగదు.

ఆఁకలి ఘనమైన నదరి సింహంబు
మేఁకలఁ బొరిపుచ్చి మెసవునే మఱియు.

ఇరవొందమందుగా నింటను గెల్చి
వరుస రచ్చను గెల్వ వలెను వేవేగ. 4

ద్వి. ఉపకారమోపిక నొనరించువారి
కపకారమొనరించు టది ధర్మమగునె.

ఉపమింప సత్కీర్తి యొకయేట రాదు
అపకీర్తి కనుమూయు నంతనె వచ్చు. 6

ఎంతేసి కార్యంబు లేగుదెంచినను
వంతనొందుచు ధృతి వదలంగఁ దగదు.

ఎసఁగ మ్రొక్కినవార మిడునదే వేల్పు
వసుధనక్కఱదీర్పు వారె చుట్టములు.

ద్వి. కరిజొంపిఁజిక్కిన గ్రమ్మఱనెత్తఁ
గరియోపుఁగానిసూకరమెట్టులోపు.

కులముప్రధానమే గుణములేకున్నఁ
గలశాబ్ధిఁబుట్టదే కాలకూటంబు. 10

చెనటిమూర్ఖునకు సిరివచ్చెనేని
చెనఁకియెవ్వరినేమి చేయునోరేగి. 11

దండడిడీకొని తగరుడాకినను
కొండలమందునె కులపర్వతంబు. 12

ధర్మమెయ్యెడనైనఁ దనుగాచునెడి
నిర్మలవాక్యంబు నెఱినమ్మవలయు. 13

ద్వి. పనివడిమబ్బులో పలినీళ్లనమ్మి
దోసనీళ్లుదెగఁగొట్టు దురవెఱ్ఱులైన.

పలువిచ్చినగరాదు పరులయిండ్లకును
పలుమాఱుపోరాదు పనులులేకుండ.

పిన్నయైననుబుద్ధి పెద్దయౌవాని
మన్నింపఁదగునది మాన్యసమ్మతము.

పుట్టుభోగములన్ని పోయినవేళ
బట్టలేదనిచింత బడుటమేలగునె. 17

పొసగినబంగారు బొమ్మనుదెచ్చి
మసిపాతగట్టుట మానితంబగునె. 18

ద్వి. బిడ్డలకొసఁగక పెండ్లానికిడక
వడ్డికిచ్చుచుఁజీమ వలెగూర్పదగదు.
వదలకసన్మంత్రి వాక్యంబువినెడి
సదమలమతిరాజు సౌఖ్యంబునొందు.
సత్యంబుఁదప్పక చరియింపవలయు
నిత్యంబులనరాదు నిఖలసంపదలు.

ద్వి. వెదకఁబోయినతీఁగె విస్మయంబొదవ
పదములఁదగులుట భాగ్యంబుకాదె.
క్షితిఁగానఁదానుజేసినపాతకంబు
వెతలఁబెట్టఁగఁబోదు విభులేశునైన.

ఆ-వె. అంతరంగమందు నపరాధములుచేసి, మంచివానివలెను మనుజుఁడుండు
నితరులెఱుఁగకున్న నీశ్వరుఁడెఱుఁగఁడా, విశ్వదాభిరామ వినురవేమ. 24

క. తనవంకచుట్టములకం, టెను బెనిమిటివంకవారి నెనరగుచుందం
బునఁజూచునెలత గొనముల, గనిగాదె తలంచిచూడఁ గానెయ్యెడలన్, 25

# Third Class.

క. శ్రీమంతుఁడె కులవంతుఁడు, శ్రీమంతుఁడె సుభగరూప జితకంతుండౌ
శ్రీమంతుఁడె గుణవంతుఁడు, శ్రీమంతుఁడె సిద్ధశేముషీమంతుఁడిలన్. 1

క. ఏనరునకు విత్తముగల, దానరుఁడె కులీనుఁ డధికుఁ డార్యుండతఁడే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి, నానాగుణగణము కాంచనమ్మున నిలుచున్. 2

క. శత్రుఁడు చదువని పుత్రుఁడు, శత్రుఁడు ఋణకారియైన జనకుఁడు మిగులన్
శత్రువు రూపసి యగు సతి, శత్రువు దుశ్చరితయైన జననితలంపన్. 3

క. తనయొడలిం గలనెత్తురు, ధనహీనుని విడిచిపోవు దారాదిసుహృ
జ్జనములు విడుచుటయరుదే, మనుపీనుఁగు నిర్ధనుండు మదిఁబరికింపన్. 4

క. దానముభోగమునాశము, పూనికతోమూఁడుగతులు భువిధనమునకున్
దానముభోగమునెఱుఁగని, దీనుని ధనమునకుగతి తృతీయమెపొసఁగున్. 5

క. ఉత్తమగుణములునీచున, కెత్తెఱఁగునఁ గలుగనేర్చు నెయ్యెడలందా
నెత్తెచ్చికరఁగిపోసిన, నిత్తడి బంగారమగునె యిలలోసుమతీ. 6

క. ఓడలబండ్లునువచ్చును, ఓడలునాబండ్లమీద నొప్పఁగవచ్చున్
ఓడలుబండ్లునువలెనే, వాడంబడుఁగలిమిలేమి వసుధను సుమతీ. 7

క. దయఁబోలవధ్వరంబులు, దయఁబోలవు సకలభూమి దానచయంబుల్
దయఁబోలవు జపతపములు, దయతలపోయంగశిష్టతరధర్మమిలన్. 8

క. కూడినద్రవ్యముపాత్రుల, కాడంబరవృత్తినొసఁగ నదివృథయెయగున్
బూఁడిదలోహోమమువలెఁ, బాడింటికినిడినదీప పత్తియుఁబోలెన్. 9

గీ. తస్కరులు భూమిపతులు విత్తములుబలిమిఁ
బాదివికొనిపోవఁ జూచుచుందురుగాని
యీఁగలిగియేరికిని దగనిడఁగలేని
కష్టలోభులకేల సద్గతులుగలుగు. 10

గీ. ఎంతచదువుచదివి యేనీతిఁవిన్నను, హీనుఁడవగుణంబు మానఁడెందు
బొగ్గుపాలఁగడుగఁ బోవునామలినంబు॥ విశ్వ॥ 11

గీ. కుక్కతోఁకఁబట్టి క్రోవిసబెట్టిన, గ్రోవిచాయనుండు గొంతవఱకు
గ్రోవితీసిచూడఁ గొడవలివలెనుండు॥ విశ్వ॥ 12

గీ. గాడిదతనువునను గంధంబుపూసిన, నేమియెఱుఁగఁజాల కెగసితన్ను
నీదుకానివాని యిష్టమీలాగురా॥ విశ్వ॥ 13

క. ధనమేమూలము జగతికి, ధనమేమూలంబుసకల ధర్మంబులకున్
గొనమే మూలముసిరులకు, మనమేమూలంబుముక్తి మహిమకువేమా. 14

గీ. నిక్కమైనమంచి నీలమొక్కటిచాలు, తళుకుబెళుకుఱాలు తట్టెఁడేల
చదువఁ బద్యమరయ, జాలదాయొక్కటి॥ విశ్వ॥ 15

గీ. నీళ్లలోనిమీను నిగిడి దూరముపాఱు, బయటమూరెఁడైనఁ బాఱలేదు
స్థానబలిమికాని, తనబల్మికాదురా॥ విశ్వ॥ 16

క. కొంచెపునరుసంగతిచే, నంచితముగఁ గీడువచ్చు నదియెట్లన్నన్
గించిత్తునల్లిగఱచిన, మంచమునకుఁ బెట్లువచ్చు మహిలోసుమతీ. 17

గీ. గొడ్డుటావుఁబిదుకఁ గుండఁగొంపోయినఁ, బాలనీకతన్ను బండ్లువిఱుగ
లోభివానినడుగ, లాభంబులేదురా॥ విశ్వ॥ 18

గీ. నిజమునాడువాఁడు నిర్మలుండై యుండు, నిజమునాడువాఁడె నీతిపరుఁడు
నిజముపల్కకున్న, నీచచండాలుండు॥ విశ్వ॥ 19

గీ. మిరపగింజచూడ మీఁదనల్లఁగనుండు, కొఱికిచూడలోనఁ జుఱుకుమనును
సజ్జనులగువారి, సారమిట్లుండురా॥ విశ్వ॥ 20

గీ. లక్ష్మిపోవునాడు లంకేశు రాజ్యంబు, నంతటఁ గపిసేన యాక్రమించె
చేటుకాలమైనఁ, జెఱుపనల్పుఁడెచాలు॥ విశ్వ॥ 21

గీ. వ్యాధికలిగనేని వైద్యునిచేతను, మందుదినకగాని మానదెందు
చెంతదీపమిడక, చీకటితొలఁగునా॥ విశ్వ॥ 22

గీ. పరగఱాతిగుండు పగులగొట్టగఁవచ్చు, కొండలన్నిపిండి గొట్టవచ్చు
కఠినచిత్తుమనసు, కరిగింపఁగారాదు॥ విశ్వ॥ 23

గీ. వేఱుపురుగు చేరి వృక్షంబుఁ జెఱుచును, చీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచు
కుత్సితుండు చేరి, గుణవంతుఁ జెఱుచురా॥ విశ్వ॥ 24

గీ. కార్యగతుల తెఱఁగు కలరూపు సెప్పిన, నధికమతులు దాని నాదరింతు
రల్పభాగ్యబుద్ధు లగువారలకు వడఁ, పరమకారణంబు విషమువోలె. 25

---

# Fourth Class.

క. జననీజనకులవృద్ధులఁ, దనయులగురువిప్రసాధు దారాదులనే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక, వసరును జీవన్మృతుండు వాఁడుధరిత్రిన్. 1

గీ. తల్లివ్రేఁగుసువ్వె ధరణికంటెను, నాక సంబుకంటెఁబొడవు జనకుఁడరయ
గాడ్పుకంటెమనసు గడుశీఘ్రగతితృణో, త్కరముకంటెఁజింత కరముదఱుచు.

క. తనయుండుదల్లిదండ్రులు, పనిచినపనిసేయఁడేని పలుకెదలోఁ జే
కొనడేని వాఁడుతనయుం, డనఁబడునే పితృధనమున కర్హుండగునే. 3

క. శరణంబనివచ్చినభీ, కరశత్రునినయినఁబ్రీతిఁ గావఁగవలయున్
గరుణాపరులతెఱంగిది, యిరువుగసరిగావుదీని కేధర్మంబుల్. 4

క. జననీజనకగురులయెడ, నొనరించినమేలుఁగీడు నొదవించుసుఖం
బునకును దుఃఖమునకునిం, తనికొలఁది యిడనవశంబె యజునకునైనన్. 5

గీ. శోకశాత్రవభయముల చొప్పమాన్పు, ప్రీతివిశ్వాసగుణహేతు భూతమైన
మిత్రమనునక్షరద్వయ మిశ్రమైన, రత్నమే వేల్పుసృజియింపఁ బ్రబలెనొక్కొ. 6

గీ. ఇనుమువిఱిగెనేని యినుమాఱుముమ్మాఱు, కాచియతుకవచ్చు క్రమముతోడ
మనసువిఱిగెనేని మఱిచేర్పరాదయా॥ విశ్వదాభిరామ వినురవేమ॥ 7

గీ. బ్రదుకవచ్చుఁగాక బహుబాధనములైన, వచ్చుగాఁక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక, మాటతిరుగలేరు మానధనులు. 8

గీ. పుట్టలిసుమంతలిడనిడఁ బొదలుటెఱిఁగి, పుడుకఁబుడుకంగఁగాటుక పోకఁజూచి
విత్తసముపార్జనవ్యయ వృత్తులందుఁ, జిత్తమిడినట్టినరునకుఁ జేటులేదు. 9

గీ. పిల్లుగట్టునలకు బేరుండుదాసైన, నాయమునకు వెచ్చ మధికమైనఁ
బేదయైనధనదు పెన్నుద్దియైచను, నాయమునకు వెచ్చ మల్పమైన.

క. ఒడమిఁగలవెడఁగునైనను, బుడమింగలవారలెల్ల భూషింతురు శ్రీ
పెడఁబాసినదూషింతుర, కసుఁబేదఱికంబుకంటెఁ గష్టముగలదే

క. కొలదికిమీఱినలక్ష్మికి, నలరేఁడుభోగంబెరుఁకు యారసినాడన్
జలపూర్ణతటాకమునకు, నలవడఁగావాటమైన యలుఁగుంబోలెన్.

క. నెఱవగుసంపదగలిగిన, నెఱినానంగుడవఁగట్ట నేరనిమనుజుం
డఱిముఱిజేసికిఁగట్టిన, వెఱబొమ్మయకాడెయన్న విధములఁజూడన్.

గీ. తరువులతిఫలభార గురుతఁగాంచు, సంగిఁబేలుచు నమృతమొ సంగుమేఘుఁ
డుద్ధతులుగారుబుధులుస మృద్ధిచేత, జగతినుపకర్తలకునిది సహజగుణము.

క. సేతుప్రదర్శింపమహా, పాతకములుఁ బాసిపోవు బ్రాణసఖునకున్
ఘాతుకమతినొనరించిన, పాతకమే తీర్థసేవఁ బాయదునరునిన్. 15

క. మిత్రద్రోహికృతఘ్నుఁడు, ధాత్రీసురహంతహేమ తస్కరుఁడుసురా
పాత్రీభూతుఁడునిందా. పాత్రులువీరెల్లనరక భవనావాసుల్. 16

క. పరువంబుకలిమిదొరతన, మరయమియనునట్టివీని యందొకఁడొకఁడే
పొరయించుననర్థమునాఁ, బరఁగినచో నాల్గుచెప్ప వలయునెచెపుమా. 17

క. పురుషుండునెంతతెలివిగల, ధరనుత్తముఁడనఁగబరఁగుఁ దానెయ్యెడలన్
బరుసములుపలుకకున్నన్, దురితంబులుపొరయుపనుల దొరగుటవలనన్. 18

గీ. బలముగలవానిఁబలువురు బలవిహీను, లొక్కటైకూడినిర్జింతు రుత్సహించి
మధువుఁగొనను త్సహించిన మనుజుఁబట్టి, కుట్టినిర్జించుమధుకర కులమునట్లు.

క. మనమున వైరము దలపమి, యును సద్ధర్మాత్ముఁడగుట యనుగుణములుచే
కొనిదోషంబులువిడుచుట, యును నుత్తముఁడై సపురుషు నుత్తమగుణముల్.

క. మఱచినఁదలపింపఁగనగు, నెఱుఁగని వాఁడెల్లపాట్ల నెఱిఁగింపనగున్
మఱియెఱిఁగియెఱుఁగనొల్లని, కఱటిం దెలుపంగఁగమల గర్భునివశమే. 21

గీ. మీనువలతన్నుఁబొందుట గానకిష్ట, వృత్తివిహరించుచుండెడు విధమకాదె
యెల్లిచేసెదననకమేలిపుడుచేయు, మనఘయోర్చునెమృత్యువు మనుజుపనులు.

క. ఆర్యులుదఱితోఁదగియెడు, కార్యమనుష్ఠింతురట్లు గాకప్పనిమా
త్సర్యమునఁదగిచిపట్టియు, నార్యులుదుదిదూఱవగతు రాపదయైనన్. 23

క. భీరుఁడుశూరుఁడు జడుఁడువి, శారదుఁడుబలాత్మకుండు సబలుండనలే
దేరినైనమృత్యువు దుర్వారంబై యపహరించు వైదికవర్యా. 24

క. బెడిదముగఁ గత్తిఁ గొడ్డలి, పొడువఁ దెగినమ్రానఁ జిగురు పొడముపలుకులన్
జెడదునిసినకార్యంబుని, గుడనేరఁ దాఁపిదపనెట్టు గురువంశనిధీ. 25

